## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **గీతా దీక్ష** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **గీతా దీక్ష** వారి వెబ్ సైట్: http://www.geetadeeksha.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **గీతా దీక్ష** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

గీతా దీక్ష వారి వెబ్ సైట్:

**http://www.geetadeeksha.com**



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గీతా మాధుర్యం

## శ్రీమద్భగవద్గీత

సంక్షిప్త సంకలనం
(ఎన్నుకోబడిన శ్లోకాలకు పద్య, తాత్పర్యం)


సంకలనం, రచన
**అమరవాది సుబ్రహ్మణ్యదీక్షితులు,**
M.Tech.






# సతీ సమేత అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు


Address :

Flat No.5; Plot 61,

Siddardha Apartments,

Siddardha Nagar,

Hyderabad - 500 038, A.P, India

E-Mail : deekshitulu_a@yhaoo.com

Mobile : 9393021360

Website: http://www.geetadeeksha.com/

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

శుభమస్తు అవిఘ్నమస్తు

# గీతా మాధుర్యం

## శ్రీమద్భగవద్గీత

**సంక్షిప్త సంకలనం**

**(ఎన్నుకోబడిన శ్లోకాలకు పద్య, తాత్పర్యములు)**

**సంకలనం, రచన :**

**అమరవాది సుబ్రహ్మణ్యదీక్షితులు,**

**M.Tech.**



# ముందుమాట

శ్రీకృష్ణపరమాత్మ కృపా కటాక్ష వీక్షణం నాపై గలిగి తెలుగు పాండిత్యం ఏమాత్రం లేని నేను క్రీ.శ. 2000 వ సంవత్సరంలో శ్రీమత్ భగవద్గీతను తెలుగు పద్య గద్య రచనగా వ్రాయగలిగాను. చుండి సుందర రామయ్యగారి ఆశీస్సులు ప్రోత్సాహంతో దాన్ని ముద్రణ కూడా చేయించగలిగాను.

కాల ప్రవాహంలో మా గురువుగారు కీర్తిశేషులయ్యాక ఎప్పుడో 2001 లో నేను అనుకున్న ఈ గీతా మాధుర్యం ఎవరికీ దాని తీపి చూపించకుండా పుస్తకాల అడుగున ఉండి పోయింది. ఈరోజు మళ్ళీ ఆ పరమాత్మ సంకల్పంతో **www.geetadeeksha.com** ద్వారా మీముందు ఉంది.

దీనిని ఇంటర్నెట్ ద్వారా అభిరుచి వున్న అందరికీ అందించాలని ప్రయత్నం చేస్తున్నాను. నా ప్రయత్నం శ్రీకృష్ణ పరమాత్మ విజయవంతం చేస్తాడని ఆశిస్తున్నాను.



శ్లోకభావం యథాతథంగా రావటం కోసం పద్యాలు చాలా వరకు ఉపజాతులు సీస పద్యం, తేటగీతులు, ఆటవెలదులు (సీ॥, తే॥, ఆ॥వె॥) ఎన్నుకొన్నాను. కొన్ని చోట్ల వృత్తములు, ఉత్పలమాల, కందము, చంపకమాల, మత్తేభము, శార్దూలము (ఉ॥, కం॥, చం॥, మ॥, శా॥) ఎన్నుకొన్నాను. శ్లోకభావం పద్యరూపేణా తృప్తి కలిగించని చోట నిస్సంకోచంగా వచనం వాడాను. భావం ఇంకా విపులీకరించాల్సిన చోట "వ్యాఖ్య" అని వచనంలో చెప్పాను. పద్యములకు వాడిన భాష వాడుక భాష కావడంవల్లనూ, పదముల కూర్పు అన్వయించుకోవాల్సిన అవసరం లేకుండా చదువుతూనే అర్థం కావడంకోసం సంధులను విడదీసి వ్రాయడం జరిగింది. అలాగే అ, ఇ, ఎ, ఒ, లతో పదములను తేలికగా అయ్యేటందుకు యకారంలేకుండా వాడాను. ఇది నా ప్రథమ ప్రయత్నం కావడంవల్ల రసస్ఫూర్తి లోపానికి, వ్యాకరణదోషాలకు నిందించక క్షమించి పెద్దలు ఆశీర్వదిస్తారని ఆశిస్తున్నాను.



## అథ ధ్యానమ్

1. ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
   వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్।
   అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ-
   మమ్బ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥
2. నమోఽస్తుతే వ్యాస విశాల బుద్ధే ఫుల్లారవిన్దాయతపత్రనేత్ర।
   యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః॥
3. ప్రసన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే ।
   జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః ॥
4. సర్వోపనిషదోగావో దోగ్ధా గోపాల నందనః।
   పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥
5. వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్ ।
   దేవకీ పరమానందం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥
6. మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్।
   యత్కృ పా తమహం వన్దే పరమానన్దమాధవమ్ ॥
7. యం బ్రహ్మ వరుణేన్ద్రరుద్రమరుతః స్తున్వన్తి దివ్యైః స్తవైః
   వేదైః సాంగపదక్రమోపనిషదై ర్గాయన్తి యం సామగాః ।
   ధ్యానావస్థితతద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
   యస్యాన్తం న విదుః సురాసురగణా దేవాయ తస్మై నమః॥

# కృతాజ్ఞతా సుమాంజలి

శా॥ శ్రీలక్ష్మీసతి అల్కపూని విడగా సీమాటియౌ భార్యతో
ఏలా బాధలటంచు నీవు భువిలో ఈతీరునన్ నిల్చి ఓ
లీలా మానుష విగ్రహా! నరులలో లీలన్ స్వయం బుందుచున్
నాలావున్ కడుపెంచు వేంకటపతీ నాపాలి సంరక్షకా!

మ॥ కలరే అన్యులు నిన్ను మించి ఇలలో కష్టంబులన్ తీర్పగన్,
కలరే వేల్పులు ఇంతలో వరములన్ కారుణ్యమే చూపి ఈ
గలరే మూడు జగాల, వేంకటపతీ! కాకున్న నా బోటికిన్
కలనన్ సాధ్యమె గీతలన్ తెలుగులో కట్టంగ నాశక్యమే.

ఉ॥ కుంటిని కాక బ్రోచితివి, కోరిన కోర్కెలు తీర్చినావు, పూ
వింటిని దాల్చువాని పిత! వైద్యుల నందర నీవుదూరి నా
కంటిన రోగముల్ నయము గా నొనరించితివయ్య, గీత నా
వెంటనెయుండి దిద్దితివి వీడక సుందర రామ చుండివై.



చం॥ చదివిన దేమి? చేసినవి చాకిరు లేమి? ముకుంద! నేడునా
ఉదరమునింపగన్ మిగుల ఓర్పున చేసెడి వృత్తి ఏమి? నే
పదములు పద్యముల్ కవిత పట్టుదలన్ యిటు వ్రాయుటేమి? నా
మదిని నివాసమై అమరవాదిని దీక్షితు బ్రోచుటన్ ప్రభూ!

కం॥ పలికితి భగవద్గీతను
పలికించెడివాడు కృష్ణ పరమాత్ముండై
ఫలమాస వీడి వ్రాసితి
అలవేంకటనాధుకిద్ది అంకిత మిడుదున్.



# శ్రీగీతా మాహాత్మ్యం

ధరోవాచ:–
భగవన్ పరమేశాన భక్తిరవ్యభిచారిణీ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో॥
శ్రీ విష్ణు రువాచ :–
ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా।
సముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥
మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వన్తి నలినీదళ మంభసా ॥
గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై ॥
సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే ।
గోపాలా గోపికా వాఽపి నారదోద్ధవ పార్షదైః।
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే॥



యత్ర గీతా విచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్।
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి॥
గీతా శ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్।
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్‌లోకాన్ పాలయామ్యహం॥
గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా ॥
చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్।
వేదత్రయీ పరానందా తత్త్వార్థ జ్ఞానమంజసా ॥
యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చలమానసః।
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్ ॥
పాఠేఽసమర్థస్సంపూర్ణే తదర్ధం పాఠమాచరేత్।
తదా గోదానజం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥
త్రిభాగం పఠమానస్తు గంగా స్నానఫలం లభేత్।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ ॥

ఏకాధ్యాయంతు యో నిత్యం పఠతే భక్తి సంయుతః।
రుద్రలోక మవాప్నోతి గణోభూత్వా వసేచ్చిరమ్ ॥
అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః।
సయాతి నరతాం యావన్మనుకాలం వసుంధరే॥
గీతాయాః శ్లోక దశకం సప్త పంచ చతుష్టయమ్ ।
ద్వౌత్రీనేకం తదర్ధంవా శ్లోకానాం యః పఠేన్నరః॥
చన్ద్రలోక మవాప్నోతి వర్షాణామయుతం ధ్రువం ।
గీతాపాఠ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్॥
గీత్యాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమాం ।
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్ ॥
గీతార్థ శ్రవణాసక్తో మహాపాపయుతోఽపి వా।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే॥
గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః।
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాన్తే పరమం పదమ్ ॥
గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః।



నిర్ధూతకల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్॥
గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్।
వృథాపాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః॥
ఏతన్మాహాత్మ్య సంయుక్తం గీతాభ్యాసం కరోతి యః॥
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్॥
సూత ఉవాచ :
మాహాత్మ్యమేతద్గీతాయా మయా ప్రోక్తం సనాతనం ।
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ॥



## గీతా మాహాత్మ్యము

భూదేవి విష్ణుమూర్తిని "ప్రభూ! ప్రారబ్ధం అనుభవించే వాడికి అనన్య భక్తి ఎలా కలుగుతుంది" అని అడుగుతుంది.

దానికి విష్ణుమూర్తి ఇలా అన్నాడు. "ఓ భూదేవీ అనన్యభక్తి కలగాలంటే గీతను అభ్యసించవలెను. అట్లు గీతను అభ్యసించినవాడు ముక్తి పొంది సుఖపడి కర్మ బద్ధుడు కాడు తామరాకు నీటిని అంటనట్లు వానికి పాపములంటవు. గీత ఉన్నచోట, గీతా పఠనము జరిగేచోట, ప్రయాగ వంటి తీర్థములన్నీ ఉంటాయి. సర్వదేవతలు, ఋషులు, యోగులు, గోపాలురు, గోపికలు, భాగవతులు వచ్చి తోడ్పడుతారు. గీతను చర్చించటం, చదవటం, బోధించటం, వినటం జరిగే చోట నేను సదా నివసిస్తుంటాను. నా ఆశ్రయము, ఉత్తమ నివాసము ఆ గీతాశాస్త్రము. గీతా జ్ఞానముతోనే నేను లోకాలను పాలిస్తున్నాను. ఈ గీత నాశరహితము, శాశ్వతము,



వర్ణనాతీతం, బ్రహ్మస్వరూపం, అర్ధమాత్రా స్వరూపం. ఇందులో సందేహం లేదు. శ్రీకృష్ణుడు పార్థునికి స్వయంగా చెప్పిన ఈ గీత త్రివేదముల సారం, తత్త్వజ్ఞాన మివ్వగలిగినది.

ఈ గీతను నిర్మలమైన మనస్సుతో ప్రతి నిత్యం పదునెనిమిది అధ్యాయాలు పారాయణం చేసేవాడు జ్ఞానసిద్ధి, ఆ పిదప పరమపదము పొందుతాడు. దీనిని పూర్తిగా చదువలేనివారు సగం చదివితే గోదాన ఫల ప్రాప్తులవుతారు. మూడవభాగం చదివిన గంగాస్నాన ఫలం, ఆరోభాగం చదివిన సోయమాగ ఫలం, ఒక్క అధ్యాయం చదివిన రుద్రలోక ప్రాప్తి లభిస్తాయి.





# 1

## శ్రీమద్భగవద్గీత

### ఒకటవ అధ్యాయము

### అర్జున విషాద యోగము

1. ధృతరాష్ట్ర ఉవాచ
ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥

**ఆ॥వె॥ ధర్మక్షేత్రమయిన ధరం గురుక్షేత్రాన**
**నాదు సుతులు పాండునందనులును**
**ధర్మ యుద్ధమునకు తరలిరి సంజయా!**
**చేసిరేమి తెలుపు చేరి అచట.**

**తా॥ ఓ సంజయా! ధర్మానికి నిలయమైన కురుక్షేత్రంలో యుద్ధము చేయుటకై సిద్ధమయిన నా పుత్రులు పాండు కుమారులు ఏమి చేశారు?**



11. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి ॥

12. తస్య సంజనయన్హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

13. తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్ ॥

**వ॥ ఆటుపిమ్మట ఆ ధ్వనితోపాటు ఇతరుల శంఖములు, నగారాలు, తప్పెటలు, మృదంగములు, గోముఖ వాద్యములు మొదలుగునవి ఒక్కసారిగా మ్రోగినవి. ఆ శబ్దములచే దిక్కులు పిక్కటిల్లెను.**

**తా॥ మన సేవ భీష్ముని రక్షణలో యున్నది. ఇట్టి సేనని, భీష్ముని భీముడు రక్షించుచున్న పాండవసేన నుండి కాపాడుట మన కర్తవ్యము. దుర్యోధనుడిట్లనుట విని భీష్ముడు సంతోషించి భయంకరంగా తన శంఖము నూదెను. ఆ కౌరవసేన దిక్కులు పిక్కటిల్లునట్లు ధ్వని చేసింది.**



26. తత్రాపశ్యత్ స్థితాన్పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా॥

27. శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి॥
తాన్సమీక్ష్య స కౌంతేయః సర్వాన్బంధూనవస్థితాన్॥

28. కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।

**చం॥ ఇరువురి సేనలో కలుగు ఇష్టుల తాతల మేనమామలన్,**
**వరుసలనున్న మామలను, వారల బందుగు లన్నదమ్ములన్,**
**గురువుల పౌత్రులన్ సుతుల కూరిమి మిత్రుల చూచి యత్తరిన్**
**పరవశుడయ్యె దుఃఖమున పార్థుడు కన్నుల నీరు క్రమ్మగన్.**

**తా॥ అప్పుడు అర్జునుడు రెండు సేనలలోనూ కల తన తండ్రులు, తాతలు, మేనమామలు, సోదరులు, పుత్రులు పౌత్రులు వంటి వరుస అయిన వారిని గురువులనూ, మిత్రులను చూశాడు. వెంటనే దయకలిగి దుఃఖిస్తూ విశేషముగా కృప, విషాదములతో పరవశుడయి కంటనీరు కారుస్తూ ఉండిపోయాడు.**

35. ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥

**ఉ॥** **చంపిన చంపుగాక నను సంగరమందున కృష్ణ! వారు నే**
**చంపగలేను బందుగుల చక్కగ పొందియు మూడు లోకముల్**
**చంపగ జాల గల్గుదునె చంచల రాజ్య సుఖమ్ము కోసమై,**
**చంపిన పొందువైభవము సంతసమాయది దైత్యమర్దనా!**

**తా॥** **ఓ కృష్ణా! వాళ్ళు నన్ను చంపితే చంపనీ. ముల్లోకములను ఏలే అవకాశం వచ్చినాకూడా నావాళ్లను నేనెలా చంపగలను? అందులోనూ చంచలమూ, అశాశ్వతమైన ఈ రాజ్యంకోసం నా బంధువులను చంపగలనా?**

36. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।
పాపమేవాశ్రయేదస్మాన్హత్వైతానాతతాయినః ॥



37. తస్మాన్నార్హావయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ॥

**కం॥** **చంపిన నీ పాపాత్ముల**
**ఇంపగునా, పాపమగును, ఏదేమైనన్**
**చంపుట తగునే స్వజనుల,**
**చంపిన సుఖమౌనె మనకు జగతిని కృష్ణా !**

**తా॥** **ఓ కృష్ణా! నేను పాపాత్ములను చంపినంత మాత్రాన పుణ్యం కలుగుతుందా పాపం కలుగదా స్వజనులను చంపుట పాపము కాదా. మనలను చంపినచో కౌరవులకూ పాతకమే కదా?**



# 2

## రెండవ అధ్యాయము
## అర్జున విషాద యోగము

11. శ్రీభగవానువాచ
అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః ॥

**కం॥** **పగవారలకై ఈవిధి**
**వగవంగానేలనయ్య! వ్యర్థులకొరకై**
**వగవరు వివేకు లెపుడీ**
**పగిదిని మృతికిన్ కిరీటి! బ్రతుకునకైనన్**

**తా॥** **ఓ అర్జునా దుఃఖించనవసరంలేని వారికోసం దుఃఖిస్తున్నావు. పైగా వివేకిలా మాట్లాడుతున్నావు. వివేకం ఉన్నవారెవరయినా జీవించి ఉన్నవారికోసం, చనిపోయిన వారికోసం మిక్కిలి దుఃఖించరు.**



13. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి ॥

**ఉ॥** **మానుము దుఃఖమీపగిది మాన్యత కాదిది నీకు అర్జునా!**
**మేనికె కల్గనీ దశలు మేలుగ బాల్యము**
**యౌవనంముదిన్, తానును జీవుడట్లె యిల దాల్చును**
**నూతన దేహమందుచే కానరు దుఃఖమేపగిది**
**గౌరవనీయులు జ్ఞానులీభువిన్.**

**తా॥** **ఓ అర్జునా! ఇది సరియైన పనికాదు. దుఃఖము మానుము. బాల్యము, యౌవనము, ముసలితనము మొదలైన దశలు ఈ శరీరమునకే కల్గును. కానీ ఈ దేహముననున్న జీవుడు మరణానంతరము ఇంకొక కొత్త శరీరం ధరిస్తాడు. మరణం శరీరానికే కావున ధీరులైన కారణ జన్ములు మరణం కోసం దుఃఖించరు.**

16. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః ॥

17. అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి ॥

ఉ॥ లేనిది ఉండదేటికిని, లేకనెయుండదు ఉన్నదెన్నడున్,
దీని నెరుంగ జాలుదురు ధీరతగల్గిన తత్త్వజ్ఞానులే,
పూనిక నిండియున్నదిల పూర్తిగ బ్రహ్మము విశ్వమంతయున్,
దానిని నాశమంతమవుదానిగ చేయగలేరు ఎవ్వరున్.

తా॥ లేనిది ఎప్పటికీ ఉండదు. ఉన్నది ఎప్పటికీ లేకపోదు. ఈ రెంటిని నిర్ణయించేది తత్త్వజ్ఞులే. ఈ విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆత్మ నాశనం లేనిది. దానినెవరూ అంతం చేయలేరు.

18. అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥



19. య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥

ఉ॥ ఆత్మయె శాశ్వతంబగును, అయ్యెడు నాశము ఈశరీరమే,
ఆత్మయె అప్రమేయమగు, ఆలము చేయుట ఒప్పు నీకిలన్
ఆత్మకు చావుయున్నదని ఆత్మయు చంపెడునట్టిదానిగన్
ఆత్మను ఈవిధిన్ తలచునందరు మూర్ఖులె
పాండునందనా!

తా॥ ఓ అర్జునా! నాశనంలేని ఆత్మకు ఈ శరీరాలు శాశ్వతం కావు. ఆత్మ ఒక్కటే నిత్యం. కనుక యుద్ధం చేయటమే నీకు తగినపని. ఈ ఆత్మ చంపుతుందని కాని చంపబడుతుందని కానీ భావించేవారందరూ అజ్ఞానులే. ఆత్మ చంపేది కాదు, చచ్చేది అంతకంటే కాదు.

20. న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥



ఉ॥ చావుల పుట్టుకల్ బడక శాశ్వతమైనది ఆత్మ, నేడదే
చేవగ నుండ బోవుటయు, చేరుచు నొక్కెడ లేకపోవుటన్
ఈ విధి కాదు ఎన్నడును ఏలన, ఆత్మ యనాదిదౌటచే
కావున నాశనంబగును కాయమె, ఆత్మయు
చావులేనిదౌ.

తా॥ ఆత్మకు పుట్టడం, చావడం అనేవి లేవు. అది ఒకప్పుడు ఉండుట మరొక యెడ లేకపోవుట అంటూ ఉండదు. జన్మరహితమూ, శాశ్వతమూ, అనాది, సిద్ధము అయిన ఆత్మ నిత్యమైనది. అందువల్ల శరీరాన్ని నాశనం చేసినా అందులోని ఆత్మ మాత్రం చావదు.

21. వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తి కమ్ ॥

కం॥ నాశన రహితము ఆత్మయె
నాశము పుట్టుకయులేని నాణ్యత నొప్పున్
నాశము చేయగబోడిటు
నాశము చేయించలేడు నరుడది తెలియన్.



తా॥ పార్థా! ఆత్మ నాశన రహితమనీ, చావు పుట్టుకలు లేనిదనీ శాశ్వతమైనదని తెలుసుకున్నవాడు ఎవరినీ చంపలేడు, చంపబోడు.

22. వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥

కం॥ మనుజుడు వదలును చీకిన
తన వస్త్రము అంతెగాక, దాల్చును మేలౌ,
అనవుగ ఆత్మయు తా నూ–
తనమగు దేహమును పొందు తనువును వీడన్.

తా॥ మానవుడు చీకిపోయిన పాత బట్టలను విడిచి పెట్టేసి కొత్త బట్టలు వేసుకున్నట్లే ఆత్మ కృశించిపోయిన శరీరాలను వదిలి కొత్త దేహాలు పొందుతుంది. కావున చావు అంటే ఒక వస్త్రం వదలుట, పుట్టుట అంటే ఒక నూతన వస్త్రం ధరించుట. మరి ఇక చావుకు దుఃఖించనేల.

23. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥

24. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥

**ఉ॥ ఆత్మనుద్రుంచ వాయుధము, లాహుతి చేయగలేదు అగ్ని, యా**
**ఆత్మయె తా సనాతనము, ఆయది నిత్యము, సర్వవ్యాప్తమౌ,**
**ఆత్మయె ఏ వికారముల నందదు, వ్యక్తము కానిదౌ తగన్**
**ఆత్మయె నీటిలో తడువ, దయ్యది ఎండదు, శాశ్వతంబగున్.**

**తా॥ ఈ ఆత్మను ఆయుధాలు నరకలేవు, అగ్ని కాల్చలేదు, నీరు తడపలేదు, గాలి ఎండబెట్టలేదు. ఆత్మ ఖండించరానిది, కాలనిది, తడవనిది, ఎండనిది. అది నిత్యమైనది. సర్వవ్యాప్తమయినది శాశ్వతము చలన రహితము సనాతనము అయినది.**

26. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥



27. జాతస్య హి ధ్రువో మృత్యుఃధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥

**ఉ॥ చావులు పుట్టుకల్ కలవు చక్కగ ఆత్మకు దేహమట్లుగా**
**భావనచేసి నీవిటుల బాధనుపొందగ పాడికాదు, ఈ**
**చావది తప్పదీ ఇలను జన్మనుపొందిన ప్రాణికోటికిన్**
**జీవులు చచ్చిపుట్టునిక చింతనుబొందుట దేనికర్జునా !**

**తా॥ అర్జునా! శరీరంతో పాటు ఆత్మకు కూడా చావు పుట్టుకలు ఉంటాయని భావించినప్పటికీ నీవు ఈ రీతిని శోకింప తగదు. ఎందుకంటే పుట్టినవాడికి చావు తప్పదు. అట్లే చచ్చిన వాడికి మరల పుట్టుటా తప్పదు. తప్పింపరాని ఈ విషయం గురించి ఇక దుఃఖించడం ఎందుకు?**

28. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥

**కం॥ జీవుడు పుట్టక పూర్వము**
**జీవుని మరణాంతమందు చెందెడి రూపున్**
**ఆ విధము తెలియనేరము**
**కావున మధ్యంబునందు కలత ఇదేలా.**



**తా॥ జీవులు పుట్టుటకు ముందు కానీ మరణానంతరం కానీ ఏ రూపంలో వుంటాయో ఎవరికీ తెలియదు. మధ్యకాలంలో మాత్రమే కనిపిస్తాయి. అర్జునా మరి ఇక దుఃఖమేల చెందెదవు.**

29. ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥

30. దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥

31. స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥

**ఉ॥ ఆత్మను చూచునొక్కడు, తనాత్మను గూర్చిన మాటలాడు,**
**తా నాత్మను వింతగా వినును, ఆత్మనెరుంగరు విన్నకొందరా**
**ఆత్మయె నిండె దేహముల, అత్తరి చావుకు దుఃఖమేల ఇం**
**ద్రాత్మజ! చాపమున్ కొనుము ధాటియొనర్పుము యుద్ధమీయెడన్.**



**తా॥ ఒకడు ఆత్మను చూస్తున్నాడు. ఒకడు విచిత్రంగా దానిగూర్చి మాట్లాడుతున్నాడు. అట్లా విన్నవారిలో కొందరికి ఆ ఆత్మ గురించి ఏమీ తెలియదు. అన్ని దేహములయందు ఆత్మ వుంటుంది. దానికి చావే లేదు. కావున చావు గురించి దుఃఖమేల? చింత చెందకు. నీ క్షత్రియ ధర్మానికి తగ్గ విధంగా యుద్ధం చెయ్యి.**

32. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్ ॥

33. అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి॥

**ఉ॥ తీరుగ స్వర్గముల్ కలిగి తీరును యోధకు అప్రయత్నమై**
**కోరిన పొందు క్షత్రియుడె, కోరియు పొందరు అన్యులెన్నడున్**
**పోరునుమాని నీవిలను పొందుదువా యపకీర్తి, తథ్యమౌ**
**ఊరక శత్రునింద, విను ఊపిరి వీడుట ఉత్తమంబగున్.**

**తా॥ తెరచి వుంచిన స్వర్గ ద్వారం లాంటి ఈ యుద్ధం నీకు అప్రయత్నంగా సమకూరింది. ఇట్టి అవకాశం క్షత్రియులకే కానీ ఇతరులకు కోరుకున్నా దొరకదు. ఇప్పుడు నువ్వు యుద్ధం చెయ్యకపోతే అపఖ్యాతి, శత్రువుల నింద, అవమానం తప్పవు. ఎందుకు నీకీర్తి పోగొట్టుకుంటావు? ఇంతకంటే మరణమే శ్రేయము కదా.**

35. భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

36. అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యన్తి తవాహితాః ।
నిందన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥

**కం॥ విను, వీరుడంచు తలచిన**
**జనులే నిను పిరికిపంద జతగా చేయన్,**
**విని శత్రులు నిందింతురు**
**కనగలవా అంతకన్న కఠినపు బాధన్.**

**తా॥ ఇంతదాకా నిన్ను వీరుడిగా గౌరవిస్తున్న వాళ్ళంతా భయపడి యుద్ధం మానేసిన పిరికిపందగా నిను శత్రువులు నిందిస్తారు. అంతకంటే కఠినమైన దుఃఖం ఉంటుందా?**



37. హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ ! యుద్ధాయ కృతనిశ్చయః ॥

**కం॥ మరణించిన స్వర్గంబౌ**
**మరి నీశత్రువుల దునుమ మహిరాజ్యంబౌ,**
**మరువకు పాపము కాదిది**
**అరయగ యుద్ధమున నీకు అది సాధ్యంబౌ.**

**తా॥ అర్జునా! ధర్మ యుద్ధంలో మరణిస్తే స్వర్గం లభిస్తుంది. శత్రువులను జయిస్తే రాజ్య భోగాలు భూమిపై అనుభవిస్తావు. అందువల్ల ఇది పాపము కాదు. యుద్ధం నీకు అవశ్యము.**

42. యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః ।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః ॥

43. కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥



44. భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే ॥

**ఉ॥ వేదము సర్వమున్ తెలియు వేత్తలు స్వర్గసుఖాల కోసమై**
**వాదము చేసి వేదముల వాక్యము బల్కుచు కర్మభూమిలో**
**పొందుగ జన్మనొందెదరు, పొందియు స్వర్గములో సుఖమ్ములన్,**
**పొందరు మోక్షమున్, మనసు పొందదు స్థైర్యము కర్మప్రాప్తితో.**

**తా॥ అర్జునా! అవివేకులు కేవలం వ్యర్ధ వాదాలపట్ల ఆసక్తి కలవారూ, స్వర్గంలోని సుఖాలను మించింది ఏదీ లేదని వాదించి వేద వాక్యాలు వల్లె వేస్తుంటారు. వారు, వారి కర్మల ఫలితంగా స్వర్గాన్ని పొంది సుఖించినప్పటికీ తిరిగి కర్మభూమిలో జన్మిస్తారు. కానీ మోక్షం పొందరు. అట్టివారి బుద్ధికూడా నిలకడగా ఉండదు.**

47. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫల హేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి ॥

**ఆ॥వె॥ కర్మచేయువరకె కలదధికారంబు**
**కర్మఫలము యెపుడు కాంచవలదు**
**పనుల చేయరాదు ఫలముల నాసించి**
**కర్మ మానరాదు కఠినమనుచు.**



**తా॥ కర్మలు చేయడం వరకే నీకు అధికారం కలదు. కర్మ ఫలంతో నీకు సంబంధం లేదు. కనుక ప్రతిఫలం ఆశించి కర్మలు చేయరాదు. అట్లని కఠినమైనా సరే కర్మలు మానరాదు.**

48. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥

**కం॥ సమ భావన సాగింపుము,**
**సమముగ ఫలమొందకున్న చక్కగ పొందన్**
**సమముగ కర్మలు చేయుము,**
**సమదృష్టియె యోగమంచు చక్కగ తెలియన్.**

**తా॥ ఫలం దక్కినా, దక్కకున్నా కర్మలను సమ బుద్ధితో చేయవలెను. ఓ అర్జునా! ఈ సమదృష్టినే యోగము అంటారు.**

50. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥

ఆ॥వె॥ సమపు బుద్ధి కలుగు జ్ఞానియె వీడును
పాపపుణ్యములను వసుధయందె,
సమపు బుద్ధి నీవు సాధనచేసిన
కర్మలందు నేర్పు కలుగచేయు.

తా॥ సమభావన కల్గిన పురుషులు పాప పుణ్యాలను రెంటినీ ఈ లోకంలోనే వదిలి వేస్తున్నారు. కనుక సమత్వ బుద్ధితో చేసే నిష్కామ కర్మయే యోగము. అదియే సరియైనది.

57. యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

కం॥ వెరవడు దుఃఖములందిన
అరయడు భేదంబు శుభము అశుభములందున్
ధర ! సర్వత్ర విమోహిగ
స్థిరముగ తానుండువాడె స్థితప్రజ్ఞుడిలన్.

తా॥ స్నేహ వ్యామోహాలు లేకుండా శుభాశుభములప్పుడు పొంగుట క్రుంగుట లేక సర్వత్రా విమోహిగా స్థిరముగా ఉండువాడే స్థితప్రజ్ఞుడు.



68. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

ఆ॥వె॥ ఎవని ఇంద్రియములు ఏవిషయములందు
తగులు గొనక ధరణి తనరియుండు,
అతని జ్ఞాన మదియే అలరారు స్థిరముగా
ఇంద్రియాల నణచు ఇచ్ఛనుండి.

తా॥ ఓ అర్జునా! విషయ సుఖాలయందు తగులుకొనక నిగ్రహం ఉన్నవాడికి స్థిరమైన బుద్ధి కలుగుతుంది. ఇంద్రియాలను కోర్కెలనుండి మళ్ళించగల వాడే స్థితప్రజ్ఞుడు.



# 3 మూడవ అధ్యాయము

## కర్మ యోగము

10. సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్ట కామధుక్ ॥

11. దేవాన్ భావయతానేన తే దేవా భవయంతు వః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥

ఉ॥ యజ్ఞము కోర్కెలన్ గరపునట్టిది వృద్ధిని పొందుదావిధిన్,
యజ్ఞముతోటి దేవతలనందరినిన్ కదు తృప్తి చేయగన్,
ప్రజ్ఞతొ పొందజాలుదురు వర్షము, తీరును ఈప్సితమ్ములున్
యజ్ఞముచేత ఒండొరుల అర్థములొందుదు శ్రేయమొప్పగన్.

తా॥ యజ్ఞ యాగములతో దేవతలను సంతృప్తి పరచండి. వారు మీకు సమృద్ధిగా పాడిపంటలు ఇచ్చి మీకు సంతోషం కలిగిస్తారు. పరస్పరం సద్భావం శ్రేయస్సు చేకూరుతుంది.



21. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

కం॥ ఉత్తముడు చేయు కర్మలు
ఉత్తమముగ చేతురయ్య యుర్విని పరులున్,
ఉత్తముడుంచు ప్రమాణము
ఉత్తమమై ఉన్నతముగ యుర్విని నిలుచున్.

తా॥ ఉత్తముడు చేసిన పనినే ఇతరులు అనుకరిస్తూ చేస్తారు. అతను నెలకొల్పిన ప్రమాణాలనే తర్వాత లోకం ఉన్నతంగా అనుసరిస్తుంది.

22. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

ఆ॥వె॥ మూడు లోకములను కదు ప్రీతి నే కోరు
కొనున దేమిలేదు, కొదవలేదు,
కర్మ నెరపుచుంటి కర్తవ్యమే లేక,
చక్కగాను నేను జగతి కొరకు

తా॥ ఓ అర్జునా! ముల్లోకాల్లోనూ నేను చేయవలసిన పని ఏమీ లేదు. నాకు లేనిది కానీ, కావలసింది కానీ ఏమీ లేకపోయినప్పటికీ నేనుకూడా, లోక కళ్యాణం కోసం కర్మలు నిర్వహిస్తూ ఉంటాను.

30. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా ।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥

**కం॥ అంతర్యామిగ నీ మన-**
**సంతయు నను నిల్పి కర్మలర్పించుమయా!**
**సుంత మమత్వము ఆసయు**
**సంతాపములేక నెరపు సమరము పార్థా !**

**తా॥ నీవు చేసే సమస్త కర్మలూ నాకు సమర్పించి, వివేకంతో ఆశా, మమకారాలు విడిచిపెట్టి, నిశ్చింతగా యుద్ధం చెయ్యి.**

35. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

కం॥ అరమరిక లేక చేసిన
పరధర్మము కాదు మేలు భయభరితంబౌ,
కొరవైనా నిజధర్మమె
సరియైనది దానివల్ల చావును మేలౌ.

**తా॥ ఇతరుల ధర్మం చక్కగా చేసేకంటే కొంచెం సరిగాచేయలేని నిజధర్మం చేయుటే సరియైనది. భయంకరమైన పరధర్మం కంటే నిజ ధర్మం చేస్తూ మరణించడమే మంచిది.**



37. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

38. ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥

39. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ॥

40. ఇంద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥

**సీ॥ రజముచే బుట్టును ప్రజలకు కామమ్ము,**
**కోరిక తీరక క్రోధ మవును**
**కామమే పాపాల కారణంబగునయ్య**
**కలుగనివ్వదు తృప్తి, గట్టివైరి;**
**అగ్నిని ధూమంబు, అద్దమున్ మురికియు,**
**గర్భశిశును మావి గమ్మినట్లు**
**జ్ఞానమున్ గప్పును ఘనమైన కామంబు**
**అగ్ని వంటిది జ్ఞానికరిసమంబు**



**తే॥ ఇంద్రియాలును బుద్ధియున్ ఎనయు మనసు**
**కామ ఆశ్రయాలని చెప్పగాను వినుము,**
**అట్లు కామము జ్ఞానమ్ము నావరించి**
**పార్థ! మానవాళిని మోహపరచునయ్య.**

**తా॥ ఓ అర్జునా! రజోగుణం వల్ల కలిగిన కామ, క్రోధాలు అన్ని పాపాలకు మూలకారణం. ఎంత అనుభవించినా తనివి తీరని కామం, పాతకాలకు దారితీసే కోపం ఈ రెండూ మనిషికి గొప్ప శత్రువులు. పొగ అగ్నినీ, మురికి అద్దాన్నీ, మావి గర్భస్థ శిశువుని కమ్మినట్లు కామం ఆత్మ జ్ఞానాన్ని ఆవరించి, జ్ఞానులకు శత్రువవుతుంది. అది అగ్నితో సమానం. ఈ కామానికి ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ఆశ్రయాలని చెబుతారు. అవి జ్ఞానాన్ని కప్పివేయుట వల్ల మనుష్యులకు మోహం కలుగుతుంది.**



42. ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః॥

**ఉ॥ ఒప్పగ ఇంద్రియాలవియె ఉత్తమమైనవి మేనికంటె, తా**
**గొప్పది మానసంబగును కోవిద! ఇంద్రియశ్రేణికంటె, తా**
**గొప్పది బుద్ధియంచెరుగు కూరిమితోడి మనస్సుకంటె, తా**
**నెప్పుడు ఆత్మ మించు నిల ఇంపుగ బుద్ధిని చూడు మర్జునా!**

**తా॥ ఓ అర్జునా! దేహం కంటే ఇంద్రియాలు గొప్పవి. మనస్సు ఇంద్రియాల కంటే శ్రేష్ఠం. బుద్ధి మనస్సుకంటే గొప్పది. అయితే బుద్ధిని అధిగమించింది మాత్రం ఆత్మ ఒక్కటే.**

4

## నాల్గవ అధ్యాయము
## జ్ఞాన యోగము

7. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥

8. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

**ఉ॥ ధర్మముహాని చెందుచు నధర్మము వృద్ధిని పొందుచుండగన్
ధర్మపు సుస్థిరంబునకు ధాత్రిని దుష్టుల శిక్ష చేయగన్
కూర్మి సురక్ష శిష్టులకు కూర్చగ నేనవతారమెత్తుదున్
ఓర్మి యుగాలనన్నిటిలొ ఉన్నతమౌవిధి పాండవోత్తమా!**

**తా॥ ఓ అర్జునా! ఈ లోకంలో ధర్మం అధోగతి పాలై అధర్మం ప్రబలినప్పుడల్లా నేను పుడుతూనే వుంటాను. సజ్జనుల రక్షణకు దుర్జన సంహారానికి ధర్మ రక్షణకు నేను అన్ని యుగాలలోనూ అవతరిస్తుంటాను.**

10. వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥



**ఆ॥వె॥ రాగ భీతి క్రోధ రహితులు, నాయందు
అలరు భక్తి నన్ను ఆశ్రయించి,
జ్ఞానతపముచేత జగతి పవిత్రులై,
అనఘ! నాదురూపమందినారు.**

**తా॥ అనురాగం, భయం, కోపం విడిచిపెట్టి, నన్నే ఆశ్రయించి నామీదే మనస్సు లగ్నం చేసిన వాళ్ళు తత్త్వజ్ఞానమనే తపస్సుచేత పవిత్రులై నన్ను పొందుతారు.**

22. యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥

23. గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥

**సీ॥ అప్రయత్నముగనె అమరువస్తువులచే
తృప్తిచెంది అసూయ దెలియడతడు,
ద్వంద్వముల కతీతభావంబునను యుండు,
సిద్ధి నసిద్ధులన్ స్థిరమునుండు,
కర్మలు చేసియు ఘనుడైన పురుషుడు
కర్మబంధమునను కట్టుబడడు,**



**సర్వసంగత్యాగి చక్కగ ముక్తుడై
జ్ఞానాంతరంగుడై మనుచునుండు,**

**తే॥ అట్టి పురుషుడు కర్మలు యజ్ఞములను
తలపుతో దైవప్రీతికై తాను జేయు,
కర్మలును విలీనమ్ములై కరగిపోయి
మనసు పరమాత్మపైన నిమగ్నమవును.**

**తా॥ అప్రయత్నంగా లభించిన వస్తువులతో సంతృప్తి చెందుతూ, ఇతరులమీద అసూయలేక సుఖ దుఃఖాలు జయాపజయములు మొదలైన ద్వంద్వములయందు సమదృష్టి కలవాడు కర్మలు చేసినా కర్మ బంధాల తగలడు. ఓ అర్జునా! దేని మీదా ఆసక్తి లేకుండా విముక్తి పొంది మనస్సును ఆత్మ జ్ఞానంమీదే నిలిపినవాడు భగవంతుడి ప్రీతికోసం, లోక కళ్యాణం కోసం చేసే కర్మలు పూర్తిగా నశించి పోతాయి.**

34. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥



**తే॥ చేసి సాష్టాంగదండము, చేరి గురుల
సమయమునుచూసి ప్రశ్నించి సవినయముగ,
సరళమగు బుద్ధి సేవలన్ నిరతిచేయ,
పరమజ్ఞానమ్మునిత్తురు వారు నీకు.**

**తా॥ తత్తవేత్తలయిన జ్ఞానుల వద్దకు వెళ్ళి వినయ విధేయతలతో సాష్టాంగ వందన మాచరించి సమయ సందర్భం చూసి బాగుగా ప్రశ్నించి సేవలు చేసి ఆ పరమ జ్ఞానమును నేర్వగలవు.**

39. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥

**తే॥ నిష్ఠ, శ్రద్ధయు, ఇంద్రియ నిగ్రహమున
బ్రహ్మను గురించి జ్ఞానంబు బడయగలడు
యోగి, తక్షణమ్మే జ్ఞానయుక్తుడగుచు
పరమశాంతిని పొందును పార్థ! వినుము.**

**తా॥ శ్రద్ధాసక్తులు, ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు, బ్రహ్మ జ్ఞానం పొందగలడు. దానివల్ల మనసుకు పరమశాంతి, దానివల్ల మోక్షము కలుగుతాయి.**

## 5 ఐదవ అధ్యాయము
## కర్మ సన్యాస యోగము

7. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥

ఉ॥ ఎవ్వడు కర్మచేయు విజితేంద్రియుడై తన ఆత్మ గెల్చుచున్,
ఎవ్వడు అంతరంగమున ఇంపుగ శుద్ధిని కల్గియుండు, తా
నెవ్వడు సర్వభూతముల నేర్పడు ఆత్మల వాని ఆత్మగా
గ్రొవ్వక జూచు, నాతనిని గూడవు యెన్నడు కర్మబంధముల్.

తా॥ నిష్కామ కర్మ చేయుచూ నిర్మల హృదయంతో దేహము, ఇంద్రియములను నిగ్రహించి సమస్త జీవులలో ఉండే ఆత్మ, తమ ఆత్మ ఒకటే అని తెలుసుకున్నవాడు కర్మలు చేసినా కర్మబంధములలో తగలదు.



14. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥

కం॥ పరమేశుడు జీవులకును
ధరణిని కర్తృత్వమైన, తగు కర్మైనన్,
నెరపెడి కర్మల ఫలముల
గరమౌ ఆసక్తినైన కలిగింపడయా.

తా॥ పరమేశ్వరుడు మానవుల యొక్క కర్తృత్వం కాని కర్మలు కానీ కర్మఫలాలను కానీ కలుగ చేయడం లేదు. అవి ప్రకృతిచే ప్రవర్తిల్లుచున్నవి.

15. నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః ॥

తే॥ పార్థ! జీవుల పుణ్యముల్ పాపములను
యెనసి పరమాత్మ గ్రహియింపడనుట నిజము,
జ్ఞానమును కప్పివేయ అజ్ఞాన మటుల
జీవులెల్లరు మోహితులవుదురయ్య!



తా॥ భగవంతుడికి ఎవరి పాపపుణ్యములతో నిమిత్తం లేదు. జ్ఞానాన్ని, అజ్ఞానం ఆవరించడం వల్ల జీవులు ఆ భ్రాంతిని వీడలేకున్నారు.

18. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥

కం॥ వినయము విద్యయు కలిగిన
ఘనుడౌ బ్రాహ్మణునిగాని, కడు చండాలున్,
శునకమును, కరిని, గోవును
ఘనముగ సమదృష్టిగాంచు ఘనుడే బుధుడౌ.

తా॥ ఓ అర్జునా! జ్ఞానము నెరిగిన పండితులు విద్య వినయము గల గొప్ప బ్రాహ్మణుని, ఛండాలుని, కుక్కని, ఏనుగుని, ఆవును కూడా సమదృష్టితో చూడగలరు.



## 6 ఆరవ అధ్యాయము
## ఆత్మ సంయమ యోగము
## (ధ్యాన యోగము)

5. ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥

కం॥ తనకు తనేయగు బంధువు
తన శత్రువు తానె నరుడు ధరణిని, తానే
తన నుద్ధరించుకొనవలె
తనధోగతి పాలుగాక తరియించవలెన్.

తా॥ తన మనస్సే తనకు బంధువూ, శత్రువూ కూడా. అందుచే ఎవరైననూ తనను తానే ఉద్ధరించుకోవలెను. తన ఆత్మను అధోగతి పాలు చేయరాదు.

6. బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥

కంII **విను నిగ్రహించ మనసును**
**తన మనసే బంధువగును, తనకారీతిన్**
**మనసును జయించకుండిన**
**తన మనసే ప్రబల వైరి తనకే పార్థా !**

తాII **మనస్సును స్వాధీనమందుంచుకున్నవానికి తన మనస్సే బంధువవుతుంది. మనస్సును జయించలేని వాడికి ఆ మనస్సే ఘోర శత్రువుగా మారుతుంది.**

9. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు ।
సాదుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥

ఉII శ్రేయము కోరువాడయిన స్నేహితునైనను, మధ్యవర్తినిన్
డాయని ద్వేషినైన, తన దారిన బోవు తటస్థునైననున్
పాయని బంధువైన, నతిపాపిని, వైరిని, సాధువైననున్
ఈ యెడ నందరిన్ సమత ఏర్పడ చూచెడివాడె శ్రేష్ఠుడౌ.



తాII **సహృదయుడు, స్నేహితుడు, శత్రువు, ఉదాసీనుడు, తటస్థుడు, విరోధి, బంధువు, సాధువు, పాపి వీళ్ళందరినీ సమదృష్టితో చూడగలిగిన వాడే సర్వోత్తముడు.**

16. నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥

కంII **ఎక్కువ భుజించు వారలు**
**ఎక్కుడు పస్తుండి నిద్ర నెరుగని వారున్**
**ఎక్కువ నిద్రాసక్తులు**
**చక్కని ఆ యోగసిద్ధి సాధించరయా.**

తాII **ఓ అర్జునా! అమితంగా భుజించేవారికి, బొత్తిగా తిననివారికీ అధిక నిద్రాపరులకు, అసలు నిద్ర పోనివారికి యోగం సిద్ధించదు సుమా.**



18. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥

కంII **మనసును వశమందుంచగ**
**మనసది తన ఆత్మలో నిమగ్నంబవగన్**
**మనసున వాంఛలు వీడెడు**
**ఘనుడిల నా యోగసిద్ధి గాంచును పార్థా!**

తాII **మనస్సును వశమందుంచుకొని ఆత్మమీద స్థిరంగా నిలిపి అన్ని కోర్కెలూ విసర్జించినప్పుడు ఆ మనిషి యోగ సిద్ధి పొందాడని అంటారు.**

30. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥

కంII చూడగ ప్రాణులనాలో
పొడిగ నను వాటిలోన పరికించునయా
వాడెదురుగ నను జూచును
వాడికి నేనెదురు నిల్చి వానిని జూతున్



తాII **అన్ని భూతముల యందు నన్నూ, నాలో అన్ని భూతములను చూడగల యోగికి నేనెప్పుడూ వానియెదుటే ఉంటాను. అతను కూడా ఎదుటే ఉంటాడు.**

32. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం సయోగీ పరమో మతః ॥

తేII **సర్వజీవుల సుఖదుఃఖచయములన్ని**
**ఎంచు తనవిగా ఆ యోగి యెల్లయెడల**
**యోగులందున శ్రేష్ఠుడు యోగ్యుడతడె**
**నాదు అభిమతం బర్జునా! అదియె సుమ్మి!**

తా॥ ఓ అర్జునా! సమస్త జీవులు సుఖదుఃఖాలను తనవిగా తలంచే వాడు యోగులలో శ్రేష్ఠుడని నా అభిమతం.

41. ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

ఆ॥వె॥ పుణ్యచరితులందు పుణ్యలోకములలో
పెక్కువత్సరములు ప్రీతి గడపి
అవని సిరులుగల సదాచారు లిండ్లలో
యోగి భ్రష్టుడైన నొందు జన్మ.

తా॥ యోగభ్రష్టుడు పుణ్యకార్యాలు చేసేవాడు పొందే ఉత్తమలోకాలు చేరి అచ్చట చాలాకాలం సుఖం అనుభవించి అనంతరం సదాచాలు సంపన్నులైన భాగ్యవంతుల ఇంట జన్మిస్తాడు.



7

ఏడవ అధ్యాయము

## జ్ఞాన విజ్ఞాన యోగము

8. రసోఽహమప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః।
ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥

9. పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥

10. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజస్తేజస్వినామహమ్ ॥

సీ॥ నీటిలో రుచివలె నేనుంటినా, సూర్య-
చంద్రుల కాంతిని, సర్వవేద
ములలోని ఓంకారమును నేనె కౌంతేయ !
గగనమందు శబ్దగతియు నేనె,
మనుజుల పౌరుషంబును, పృథ్విని సుగంధ-
మును, అగ్నితేజంబు నేనె సుమ్మి,
అన్ని ప్రాణుల నున్న ఆయువు నేనె, ఆ
తాపసులందున్న తపము నేనె,



తే॥ బుద్ధిమంతుల యందున్న బుద్ధి నేనె,
ధీరులందున నెలకొన్న తేజమేను,
సర్వప్రాణుల బీజమ్ము సవ్యసాచి !
నేనెయని తెలియుము నీవు నిక్కముగను.

తా॥ ఓ అర్జునా! నేనే జలములయందు రుచిగా, సూర్య చంద్రుల కాంతిగా, సర్వ వేదాలలోని ఓంకారముగా, ఆకాశంలో శబ్దంగా, పురుషుల యందలి సత్కర్మలు చేయు పురుషత్వంగా ఉన్నాను. నేలలోని సుగంధం నిప్పులోని తేజస్సు సర్వభూతాలయందలి జీవము తపోధనుల తపస్సును నేనే. సమస్త జీవులకూ మూలకారణం నేనే. బుద్ధిమంతులలోని బుద్ధీ, తేజోవంతులయందలి తేజస్సూ కూడా నేనే అని తెలుసుకొనుము.

14. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరన్తి తే॥



ఆ॥వె॥ త్రిగుణరూపమైన దివ్యమౌ నామాయ
నధిగమించ కష్టమయినకాని
నన్నె శరణుజొచ్చు నా భక్తులందరు
దాని దాటగలరు ధరణియందు.

తా॥ త్రిగుణ స్వరూపమైన ఈ నా మాయను దాటడం సామాన్యులకు అసాధ్యం. అయితే, నన్నే ఆశ్రయించిన వాళ్ళు మాత్రం దానిని అతిక్రమించగలరు.

16. చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥

ఆ॥వె॥ పుణ్యులైన నరులు పూజించెదరు నన్ను
పుడమి నాల్గు తెరగులున్నవారు
ఆర్తు, లర్థకాము, లమిత జిజ్ఞాసులున్,
జ్ఞానులనుచు జగతి సవ్యసాచి !

తా॥ ఓ అర్జునా! నన్ను కొలిచే భక్తులు నాలుగు రకాలుగా ఉన్నారు. ఆపదలో ఉన్నవారు, సిరి సంపదలు కోరువారు, ఆత్మ తత్త్వం తెలుసుకోగోరే జిజ్ఞాసులు, ఆత్మజ్ఞానం కలవారు.

17. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః॥

తే॥ వారియందున నిత్యంబు భక్తి గొలుచు,
ఆత్మ సంధానుడౌ జ్ఞాని అధికుడయ్య!
ఏలనన అట్టి జ్ఞానికిన్ ఏను, నాకు
అతడు అత్యంత ప్రియులమైనందు చేత.

తా॥ ఈ నలుగురి యందునూ నన్ను భక్తితో స్మరించే ఆత్మ జ్ఞాని అత్యుత్తముడు. అతనికి నేనూ, నాకు అతనూ అత్యంత ఆప్తులం.



21. యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయాఽర్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ విదధామ్యహమ్॥

22. స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్॥

23. అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసామ్ ।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥

సీ॥ ఏ భక్తుడేదేవు నేరీతి గొల్చునో
అతనికి ఆ దైవమందు నేనే!
నిశ్చలంబగు శ్రద్ధ నిలుపుచున్నాడను,
ఆ దేవతల గొల్చునందు చేత
వారితో నాకృపన్ భక్తులు వాంఛించు
భోగములన్నిటిన్ పొందగలరు,
అల్పబుద్ధులయిన అట్టి నరులు పొందు
ఫలము లశాశ్వతములగునయ్య,



తే॥ అన్య దేవతలను గొల్చు అల్పబుద్ధు-
లిలను ఆ దేవతల నొందగలరు ప్రీతి,
నన్ను గొల్చెడి నా భక్తులెన్నడేని
నన్నె పొందుట తథ్యము నరవరేణ్య!

తా॥ ఏ భక్తుడు ఏ దేవతలను పూజించకోరునో అతనికి ఆ దేవతల పట్ల అచంచల శ్రద్ధను కలుగ జేతును. అట్టి శ్రద్ధా భక్తులతో ఆ దేవతలను కొల్చినా నేను ఇచ్చే కామితములనే ఆ దేవతల వల్ల పొందును. అయితే మంద భాగ్యులైన ఆ మానవులు పొందే కామితాలు మాత్రం అశాశ్వతములు. దేవతలను కొల్చినవారు దేవతలనే పొందెదరు. నా భక్తులు నన్నే పొందెదరు.



29. జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥

తే॥ శరణు పొందుచు, జరయును మరణమున్ను
లేని ముక్తికి యత్నించు మనుజులెల్ల,
అఖిల కర్మల నధ్యాత్మ మంతయున్ను
బ్రహ్మమేయని తలతురు వారు పార్థ!

తా॥ ఓ అర్జునా! జరా మరణములనుంచి ముక్తి పొందుటకు నన్ను ఆశ్రయించి ప్రయత్నించే వాళ్ళు పరబ్రహ్మ తత్త్వన్నీ ఆత్మ స్వరూపాన్ని సమస్త కర్మలనూ గ్రహించ గలిగెదరు.

